# రష్యాలో పత్రికా స్వాతంత్ర్యము

## ఒకటి పత్రికకు కోటి యాభై లక్షల ప్రచారము

పత్రికలు తల్చుకుంటే "మేము సర్వాధికారు లము. మా దెబ్బకు ఎదురులేదు; అడ్డులేదు" అంటూ ప్రగల్భాలు కొడుతూవున్న హిట్లర్, ముస్సోలినీలు సైతం సాష్టాంగపడాల్సి వస్తుంది. పత్రికలు పూనుకుంటే సాధ్యంగానిది ఏమీలే దు. యుద్ధం కావాలిఅంటే వచ్చిపడుతుంది. సంవత్సరాలతరబడి సాగుతూవున్న యుద్ధం ఆగిపోయి శాంతియేర్పడాలిఅంటే మరుక్షణం లోనే "ఆర్మిస్టిస్" శాంతి అన్నీ.

మనుష్యుల్ని ఖూనీచేయాలంటే యెంతో సేపుపట్టదు. చచ్చిపడివున్న వారికి జీవంపోయా లన్నా అంతే...విషవాయువులు బాంబులు... ఇలాంటి ఆయుధాల్ని అన్నింటినీమించిన శక్తి ఉంది ఈపత్రికలకు. కనుకనే "కత్తిపోటును మించదే కలముపోటు" అని అనాల్సివచ్చింది.

### పత్రికలు—ప్రభుత్వాలు

పత్రికలకు యింతటి అపమానశక్తివుంది కన కనే, ప్రతిదేశంలోనూ ప్రభుత్వాలు పగ్గాలతో ఈపత్రికల గమనాన్ని కొంతవరకు తగ్గించవలసి వచ్చింది. కాని ఈ ప్రభుత్వాలు ఈ పగ్గాలను చేపట్టుకొని పత్రికలను తమకు అనుకూలంగా నడిపించుకొంటూ తమసౌకర్యమునకు భంగకరము గానట్టి పత్రికలనే ప్రోత్సహించుతూ, ఇతర పత్రికల స్వాతంత్ర్యాన్ని అరికట్టుతూ ఉన్నా రు. ఇతరప్రభుత్వముల కట్టుబాటులలోనూ లేక తమ వ్యవహారాలను తామేచక్కబెట్టు కుంటూ ఉన్న స్వాతంత్ర్యదేశాలలో కూడ ప త్రికలస్థితి చాల శోచనీయముగావుంది. నియం తల పరిపాలనక్రింద ఉన్న స్వేచ్ఛా దేశాల లో పత్రికలకు ఎలాంటి స్వాతంత్ర్యముగాని లేదు. ప్రభుత్వపక్షాన్ని వహించి, ప్రభుత్వా ధికారులు చేస్తూవున్న ప్రతిపనిని ప్రశంసించు తూ ఉన్న వాటికి స్థానంఉంది. అలాగాకుంటే హిట్లర్ జర్మనీనుంచి లండన్ "టైమ్స్" పత్రికా విలేఖరిని యెందుకు తరిమివేయాల్సి వచ్చింది?

※

### ప్రజాభిప్రాయము—పత్రికలు

సామ్రాజ్యవాదుల క్రింద ఉన్న బానిస దే శాలలోని పత్రికలస్థితికూడా ఇలాగేఉంది. ప్ర జలలో చైతన్యం కల్గించి స్వధర్మ నిర్వాహకు లుగా చేయుటకు ప్రయత్నించుపత్రికలను పుడు తూవుండగానే "బిస్మిల్లా" చేస్తారు. ఇలాంటి వాటిని మన భారతదేశంలో యెన్నింటినో చూచాం. చూస్తున్నాముకూడ.

※ ※ ※

"ప్రభుత్వములు ప్రజాభిప్రాయముపై ఆధా రపడియున్నవి. ప్రజాభిప్రాయమును తయారు చేసేవి పత్రికలు." సుప్రసిద్ధ ఆంగ్లసామ్యవాద రచయిత సర్ నార్మన్ ఏంజల్ ప్రకటించిన ఈఅభిప్రాయంతో—కొంచెం విజ్ఞానంవున్న ప్రతివాడూ అంగీకరించితీరాలి. కనుకనే అవాడు విల్సన్ "నాకు ఇతరహక్కులు ఎన్ని వున్నా లేకపోయినా ఇబ్బందిలేదు. ఒక్కర చనా స్వాతంత్ర్యము ఇస్తేచాలు "సంతృప్తి పడతాను" అని ప్రకటించాడు. కాని వాటికి నేటికి ఏదేశంలోనూ దానిని ఎవ్వరూ సంపా దింపలేకపోయారు.

### రష్యాలో పత్రికలకు పూర్ణ స్వాతంత్ర్యము

పై రెండుసిద్ధాంతాలలోని సత్యాన్ని ఒ క్కరష్యాప్రభుత్వమే గ్రహించినట్లు వివిధ దేశ ములందలి పత్రికాశాసనముల పరిశీలనవలన విదితమౌతూవుంది. ప్రభుత్వాలు, ప్రజాభిప్రా యముపైన ఆధారపడివున్నవని గ్రహించుటవల్ల నే ఈసంవత్సరము ఏర్పడుపడజేసిన నూతన రా జ్యాంగవిధానమునుగూర్చి ప్రజలు తమ అభి ప్రాయాలను ప్రకటించుటకు పూర్తి స్వాతం త్ర్యం ఇచ్చివేశారు. ఆనూతన రాజ్యాంగ చట్ట మునందలి ౧౨౫వ క్లాజులో రష్యన్ప్రజలకు ఉండవలసిన స్వాతంత్ర్యాన్ని నిర్వచించుతూ పత్రికలకు పూర్తి స్వాతంత్ర్యాన్ని యిచ్చి వేశారు.

### రష్యాలో పత్రికా స్వాతంత్ర్యము

నేటిరష్యాలో పత్రికలకుగల స్వాతంత్ర్యము మరియే యితరదేశములోగాని లేదంటే అత్యుక్తి గాని సహజమైననూ అతిశయోక్తి అనిగాని, అవశ్యంఅనిగాని అనుకోటానికి వీలులేదు. అ

దేశంలో అంత రచనాస్వాతంత్ర్యం ముద్రణా స్వాతంత్ర్యంవుంది. కనుకనే రోజు రోజుకూ పెరిగిపోతూఉంది పత్రికల సంఖ్య ౧౯౧౭లో జార్ ప్రభుత్వంక్రింద ౮౫౯ పత్రికలువుంటే, ౧౯౩౬వ సంవత్సరంవచ్చి సామ్యవాద ప్రభు త్వం యేర్పడేసరికి పదివేలకుపైగా యేర్పడి నవి పత్రికలు.

※ ※ ※

### ౧ కోటి ౫౦ లక్షల ప్రచారము

ముస్సోలినీకి ఇటలీలో స్వంతంగావున్న "పో ప్యులోడి ఇటాలియా"లాగానే లండన్లో కన్సర్వేటివ్ ప్రభుత్వానికి టైమ్స్ పత్రిక ఉ న్నట్లే, రష్యాలోకూడ ప్రభుత్వంతరఫున ఒకదై నికపత్రిక వెలువడుతూఉంది. అదే "ఇజ్వెస్ టియా" పత్రిక. ఇది ప్రతిరోజూఉదయం ప్రక టింపబడుతుంది. మన ఇండియన్ ఎక్స్ప్రెస్ సైజులో నాల్గు పేజీలుమాత్రమే ఉంటుంది. ఐతేనేమి—ఆనాల్గుపేజీలు చాలా ఆకర్షణీయం తంగా ప్రజాశాహులక్యానికి ఉపయోగపడేలా ఉంటుంది. ప్రజలందరు ఈపత్రికనే కొనాలి అనే నిర్బంధంకూడా లేదు. కాబట్టే ఈ పత్రి కకు కోటిమంది చందాదారులుఉంటే కమ్యూ నిస్టుపక్షం తరఫున వెలువడే "ప్రావ్దా" అనే పత్రికకు ౧౫౦ లక్షల ప్రచారముఉంది.

ఈ "ప్రావ్దా" రిసైజులోనే ౬ పేజీలు. ఖరీదు రెండుకాణీలే. షుమారుగా ఒక అణా వుంటుంది. "ప్రావ్దా"కూడ ప్రాతఃకాలము ననే ప్రకటింపబడుతూ ఉంది.

"ఈవినింగ్ మాస్కో" అన్న రష్యను పత్రిక మాత్రము ప్రతిరోజూ సాయంకాలం వెలువ డుతూ ఉంటుంది. ఇందులోనూ ౬ పేజీల కంటే సాధారణంగా హెచ్చుఉండవు. దీని ఖరీదు ఒకఅణాయే.

### వివిధ పత్రికల పోకడలు

మాతృభాషలో వెలువడే దినపత్రికలుగాక ఆంగ్లభాషలో వెలువడుతుంది "మాస్కో డెయిలీ న్యూస్" ఫ్రెంచిభాషలో ఉంది. "లీ జర్నల్ డే మాస్కో."

ఇవి ప్రధానములైనవి. ఇవిగాక చిన్న చిన్న పత్రికలు ఎన్నోఉన్నాయి. ఇవన్నీ వెలువడే పద్ధానం చాలాతమాషాగా వుంటుంది

> సామ్రాజ్యముల అధీనములోవున్న బానిస దేశాలలో సరేసరి. అక్కడ పత్రికాస్వాతంత్ర్యము మచ్చునకైనా వుండదు. ఇంక ఇతర దేశాలలోనైనా యీ స్వాతంత్ర్యము వున్నదా అంటే అదీ లేదు. సర్వాధికారుల హస్తములలో యీ పత్రికా స్వాతంత్ర్యము అన్నదే అంతర్ధానముఅయింది.
>
> నేడు పత్రికా స్వాతంత్ర్యము యొక్క యదార్థస్వరూపము [illegible] నంటే అది రష్యాలో కనపడుతుంది. అందువల్లనే ఆపత్రికలు మహత్తరసేవజేయగలుగుతూ వున్నవి.

మన చిత్రగుప్తలాగా సంఘంలోని, ప్రభు త్వంలోని లోపాలను వ్యంగ్యరూపంలో పాఠ కులకు ప్రదర్శింపచేస్తుంది. "క్రోకోడైల్" అనే ఒక వారపత్రిక ఇందులోకేవలం "సెటైర్" (వ్యంగ్య ప్రహసనం) తప్ప మరేమీవుండదు.

"వాహిని, జమీన్ రైతు, ప్రజావాణి" లాగా కేవలం కర్షకులకోసరం ప్రకటింపబడే పత్రిక లు ఎన్నోవున్నాయి. ఇందులో ముఖ్యంగా రైతు సమస్యలేవుంటవి. ప్రతిసమిష్టి వ్యవసాయి క సంఘమువారు అసంఘ యాజమాన్యము క్రిం ద పనిచేస్తూవున్న కర్షకుల వుపయోగార్థం ఒక పత్రికను ప్రకటించుచూ వుంటారు.

"తెలుగుజండా, కాలచక్రం, జయభేరి, పట్టబలిజ, దేవాంగపత్రిక" ల వలెనే వివిధ శా ఖలవారి దిన కార్మికులకు వుపయోగపడునట్టు ప్రతిఫ్యాక్టరీతరఫునఒక్కొకపత్రిక వుంటాయి.

"ప్రజాబంధు" లాగా కేవలం సామ్యవాద సిద్ధాంతాలను చర్చించి కార్మికకర్షక సమ్మేళ నంకొరకు పాటుపడే పత్రికలు రష్యాలో వున్నాయి.

"ఆ ప్రపత్రిక, కృష్ణాపత్రిక" లవలె ప్రభుత్వ విధానాన్ని విమర్శించుతూవుండే పత్రికలు ర ష్యాలో హెచ్చుగాలేవు. అవును కాంగ్రెసు ప్రభుత్వం వచ్చాక ఈపత్రికలు వున్నట్లేవుంట వి. ఆవిటి జాతీయపత్రికలు, ప్రభుత్వంచేసే ప్రతి పనిని సమర్థించుతూవుంటాయి.

### వ్రాత పత్రికలు

అచ్చుపత్రికలు గాక ౧౯౧౭లో కూడా వ్రాయుపత్రికలు వెలువడుతూనే వున్నవి. ప్రతి రోజూ ఫ్యాక్టరీల గోడమీద పాలాలలో ఒక చోటుకు ఆయా ప్రాంతాలలోని వార్తల సం గ్రహాన్ని కాగితాలమీద వ్రాసి అతికించుతూ వుంటారు. పనివాళ్లు ఇండ్లకు పోయేటప్పుడు. ఆవార్తలు చదువుకొని వెడుతూవుంటారు, ము ఖ్యంగా వీటిలో సరిగా పనిచేయనందులకు శిక్షింపబడిన పనివారలు? దుష్ప్రవర్తనకు మంద

లింపబడిన వుద్యోగులు శిశుజననములు, మరణ ములు..ఇలాంటివన్నీ ప్రకటించుచూ వుంటారు.

మరొకరకం పత్రికలు వున్నాయి. మామూ లుగానే వార్తల క్రోడీకరించి, టైపుచేసి విక్ర యింపబడుతవి. ఇవన్నీకూడా కార్మిక కర్షక ల వుపయోగార్థమే. ప్రభుత్వం అన్ని విధాలా వారికి తోడ్పడుతుంది.

ప్రతిపత్రికలోనూ తప్పని సరిగా ఒకవ్యంగ్య చిత్రంవుంటుంది. మొదటిపేజీలోని మూడు నాలుగు కాలాల ఆడుగున్నకేవిత్రాలనువేస్తారు సాధారణంగా.

### విషయముల అమరిక

దైనిక పత్రికలన్నీకూడా ఆంధ్ర పత్రికవలె ఆరుకాలాలలోకిగాక మద్రాస్ మెయిల్ మా దిరి 2 కాలములలోకిగాక 3 కాలములలోకి విభజింపబడి వుంటుంది ప్రతిపేజీ.

మొదటిపేజీలో మొదటి రెండు కాలముల లోనూ సంపాదకీయ వ్యాసాలు ఉంటవి.మూడు నాల్గు కాలములలో విదేశవార్తలు చక్కగా సంగ్రహముగా వేస్తారు. ౫–౬ కాలములలో మాత్రము యుద్ధవార్తలు సచిత్రంగాప్రకటించి ౭–౮ కాలాలలో ముఖ్య జాతీయ వార్తలను ప్రకటించుతారు. లోపల పేజీలలో నేరములు కబుర్లు వివిధజిల్లాలవార్తలు కోర్టు తీర్పులూ సినిమావార్తలు ఉంటవి.

### కాగితపు కరవు

రష్యాలో పత్రికలఅభివృద్ధికి అనేక అవకా శాలున్నాయి కాని నిర్వాహకులు ప్రజలకు తగినన్ని పత్రికలు వేయలేకపోతూ ఉన్నారు. సరిపోయినంత కాగితం ఆ దేశములో ఉత్పత్తి కావటంలేదు. ఇతరదేశాలనుండి దిగుమతి చేయుటం వారికిఇష్టంలేదు. [illegible] సరిపోయి నంత పేపరుంటే ప్రావ్దాపత్రికకు ౧౦ కోట్లమంది చందాదారులు ఏర్పడతారని రష్యన్ ప్రజలనమ్మకం. ఇందులో ఆశ్చర్యంకూడా లేదు.

ప్రతివాడు చదువవలెను అన్నదే మనము నేటి రష్యాలో.

విమర్శనము సహేతుకముగ ఉంటే ప్రభు త్వము సహించుతుంది ముందు అవకాశం మొ సగిరయే తమవారిచర్య తీసుకొంటుంది. జనవాణి లాంటి వర్గశత్రువులకు చెందిన పత్రికలనుకూ డా స్వాతంత్ర్యం ఉంటుంది. అలాంటి సం పూర్ణ స్వాతంత్ర్యాన్ని ఇచ్చుటకేముందు వర్గ విరోధులను ఊడ్చిపారేశారు.

### పత్రికా స్వాతంత్ర్యం

పత్రికలనుండి ధరావత్తుతీసుకునే పద్ధతులు నూతన రాజ్యాంగ విధానంలో లేవు అసహ్య కరమగు విమర్శలగావించి అసత్యముల ప్రక టించితే పత్రికలపై చర్య తీసుకొంటారు. పత్రికాశాసనములు కఠినముగ లేనేలేవు.

అందుచేతనే పత్రికలు ఇలాంటి వ్యంగ్యాల ను నిర్భయంగా ప్రకటింపగలిగాయి. దాదాపు పత్రికల్లోని సగంభాగం స్వవిమర్శకే వినియో గింపబడినవి.

కొందరు రష్యన్ఉద్యోగులు చిన్ని విష యాలను తేలికగా పరిష్కరింప వీలున్ననూ అనవసరంగా చిక్కులు తెచ్చి కోతిపుండును బ్రహ్మరాక్షసి చేయు పద్ధతిని "క్రోకడైల్" లో తీవ్రంగావిమర్శించి ఒక కథానాన్ని స్పష్టంగా వివరించుతాను

"ఆవి" పక్షులు, నాల్గు గూండ్లలో నివసిం చుతూఉన్నవి. మొత్తంమీద ౯ గుడ్లను పెట్టా వి. నియమితకాలం గడిచిపోయింది. అందు లో ౫ గుడ్లుమాత్రమే అయినవి వాటిలోనూ మూడింటిమీద ఏవోచిక్కులు ఏర్పడినాయి. రెండు తెల్లగా ఉన్నాయి. గుడ్లు కుళ్లటానికి సిద్ధంగాఉన్నాయి. అన్నీ సమావేశమై నాల్గు గంటలపర్యంతం చర్చించి; పరిస్థితుల పరిశీలిం

చి సలహానొసంగుటకు ఒకనిపుణుని పిల్చుటకు తీర్మానించుకొన్నాయి వెంటనే బకా పిచ్చు కవచ్చింది. ప్రతిగూడునుచూచి ఇష్టంవచ్చినట్లు సలహానిచ్చింది. అందర్నీ తలుపులు మూసుకొ ని ఇంట్లో కూర్చోమంది. అన్నీ బాగుపడునని చెప్పింది. అన్నిఅలానే చేసాయి. కాని గుడ్లు కుళ్ళిపోయినవి. పక్షుల్లో పెద్దది చీకాకుపడింది. ఆ పెక్కడుంది. ఏమిచేస్తూవుంది తెలియలేదు. వెంటనే పిచ్చుకనుపిల్చి తల్పుతీయమంది, ఆ పిచ్చుక "మాయటంమటుకే నాకుతెల్సు. తెర వటానికి మరొకనిపుణుని పిలవాలి" అంది. ఆ లానే చేశారు ముగ్గురు ఒకగూటిలో చేరారు. తలుపులు మూసుకుని ఆలోచించుతూ వున్నా రు. ఇంతలోకే ఎక్కడ్నించో ఒకపక్షి తలు పుకొట్టింది. ఏమిటీగొడవ అని అడిగింది. అం తా నివేదించానికి తలుపులుతీసి శుభ్రమైన గా లిని లోనికిపోనిచ్చి, కుళ్లినగుడ్లను పారేసి తిరి గి గుడ్లనుపెట్టి, ఆదపక్షిచే పొదగించమని చె ప్పింది. అలా నేచేస్తే అంతా బాగుపడింది. వెంటనే పారిపోయింది ఆక్రొత్తపక్షి అందర్నీ మందలించి" అంటే ప్రభుత్వనిపుణుల చేతుల్లో ని పనులను సాధారణంగా ఇతరులు ఎలా చేయ కలుతారో అనవసరంగా ఆయిందానికి కాని దానికికూడా ఎలా ఈ నిపుణులనుపిల్చి హడా వుడిచేసేది ఇందులో చక్కగా చిత్రించారు.

ఇలావ్రాసే పత్రికలు మన దేశంలోనూ వు న్నాయి. కాని తగినంత ప్రోత్సాహం ఏది! నిర్భయంగా విమర్శించుదామంటే...కూడలే ప్రభుత్వం ఏమిచేస్తుందో అని. లేకంటే మన పత్రికలు మాత్రం ఆ "ప్రావ్దా" లాగా కోట్ల కొలది పాఠకులను సంపాదించలేవూ?

(ప్రజాబంధు)

———

# భువనగిరి హిందూ మహమ్మదీయ పరిష్కారము

## మసీదులముందు చప్పుడు కానీయమని హిందువుల అంగీకారపత్రము

(గోలకొండ ప్రతినిధి)

భువనగిరి నవంబరు ౧౭

గణపతి యూరేగింపు విషయమున జరుగుచున్న హిందూ, మహమ్మదీయ వివాదపరస్పర పరిష్కారమూలమున సమసిపోయినది. నవంబరు ౧౩ వ తేదినాడు తహసీల్దారుగారు స్థానిక హిందూ, మహమ్మదీయ ప్రముఖులను రప్పించి ఇరుపక్షములందు సమాధానము కలిగించుటకై కృషిసల్పిరి. వీరి కృషిఫలితముగా మహమ్మదీయులు మసీదులవద్ద వాయిద్యములు చేయనిచ్చుటకు నేరతీసుకొనుటకు మాకభ్యంతరము లేదని మహమ్మదీయ ప్రముఖులు నుడివిరి. ఇందుకు హిందూప్రముఖులు తమ సమ్మతిని ప్రకటించిరి. ప్రభుత్వమువారు హిందువులతో అంగీకారపత్రమును వ్రాయించుకొనవలయునని మహమ్మదీయులు కోరుటచేనవంబరు ౧౪ వ తేదినాడు పగలు ౧౧గంటలకుచౌకుమసీదులో తహసీల్దారుగారి సమక్షమున హిందువులు అంగీకారపత్రమును వ్రాసియిచ్చిరి. ఇందుప్రతి మసీదువద్దను వాటి కంపౌండు హద్దులనుండి విలుపల నూరు అడుగులవరకు యేవిధమైన వాద్యమును చేయమనియు, చౌకుమసీదు వడిబజారులో గలదు. కావునమసీదు ఫాటకుఒక వైపు ౧౫౦ అడుగుల దూరమువరకును,మరొక వైపు ౧౨౫ అడుగులవరకును వాయిద్యమును చేయమనియు, శివాలయము త్రోవలో నున్న ఈద్గాహవద్ద కూడా నూరడుగులవరకు వాద్యము చేయమనియు వ్రాయబడెను. ఈ పరిష్కారమును గావించుటలో తహసీల్దారుగారును, శ్రీ. జె. నరసయ్యగారును చాలా శ్రద్ధను గనపరచిరి,

కిషన్ రావుగారి తబాదలా

స్థానిక పాఠశాలలో పాధ్యాయులగు శ్రీకిషన్ రావుగారు దేవరకొండకు మార్చబడిరి. వీరు ఉపాధ్యాయులుగా నున్న కాలమునందు పాఠశాల అధికవృద్ధిని గాంచినది. వీరు ప్రజాహితోద్యమములందు పాల్గొని దేశీయుల అభివృద్ధికై కృషిసలిపెడివారు.

## అబిసీనియా అంతపు అంగీకారము

రోం నవ, ౧౬

యుగోస్లావియా నేడు అబిసీనియా అంతమును పద్ధతి ప్రకారం అంగీకరించినది. యుగోస్లావియా నూతనమంత్రి నేడు ఇటలీ ప్రభువుగారికి తమ సంతసము వెలిబుచ్చుచు "ప్రభువు చక్రవర్తి" యని సంబోధించెను.

## బెంగాలు గవర్నరు

కలకత్తా నవ.౧౩

కలకత్తా గవర్నరుగారు తమ ఆరోగ్యమును విరమించుకొని ౨౩ నవంబరు తేదిన కలకత్తా నుండి వెడలగలరనియు, ౨౪ నవంబరు రోజు లార్డుబ్రాబోర్ను గారు యీ పదవి యలంకరించగలరని గెజెటులందు ప్రకటించబడినది.

## నఢీసంస్థాన దేశీయ సైనికులపైగుండు వర్షము

౯ గురు మరణించుట ౨౭ గురు గాయపడుట

రోం నవ ౧౩.

సైన్యమునుండి తరిమివేయబడిన యిటలీ రొమేగ్రాయి దేశీయ సైనికులలో పెక్కుగురుచాటు కలుగుటవలన ౧౩ నవంబరు తేదిన కింగ్స్ఆఫ్రికన్ రాయి ఫైల్సువారిలో ౧౦గురు గాయపడిరి. దిబెన్యా సైనికులమధ్యజరిగిన గృహకల్లోలమే దీనికి కారణమైనటుల తెలియుచున్నది. వీరందరు నఢీ ప్రజలు.

## స్పెయినులో బ్రిటిషుప్రతినిధి

మాస్కో-నగరమునందు దింతనరకు బ్రిటిషు ప్రతినిధిగానుండిన సర్ హాడ్జిట్ హాగ్సన్ స్పెయినందు ప్రతినిధిగానుండుటకు నిర్ణయింపబడిరి.

శ్రీయుత అంతూ రామచంద్రరావుగారు

హైకోర్టు వకీలు



వీరు బాలికల ఉన్నతపాఠశాల మందిర నిర్మాణమునకై రు ౧౦౦౦ ల విరాళము వాగ్దానముచేసి రు౫౦౦లు దయచేసిరి.

## హరిజన పాఠశాలలు

హరిజన సేవకసంఘ యాజమాన్యమున గోలకపాడయందు స్థాపింపబడిన హరిజన రాత్రిపాఠశాలలలో చదువుకు పెద్ద వయస్సుగలవారు. దినపాఠశాలయందు ౪౦ మంది బాలబాలికలు విద్యాభ్యాస మొనరించుచున్నటుల కార్యదర్శి వ్రాయుచున్నారు.



## ఫెడరేషనులో చేరుటకు లంచములు

జోధుపూరు, మేవారు సంస్థానములపై ఆరోపణ.

ఆక్షేపణనిరాధారమనిప్రకటింపబడుట

మేవారు సంస్థానమును జోధ్పూరు సంస్థానమును ఫెడరేషనులో చేర్చుటకు మార్వారా అను బ్రిటిషు ప్రాంతములోని కొన్నిభాగములను సంస్థానములకు ఇచ్చుటకు నిశ్చయమై ఆలోచనలు జరుగుచున్నట్లు ఒక్కవార్త వచ్చియుండెను. కానిఇది నిరాధారమని ఇప్పుడనుచున్నారు. ఇప్పుడుఆలోచించుచున్న విషయమది కాదనియు మరియొకటి యనియు చెప్పుచున్నారు.

గత శతాబ్దిలో ౧౮౪౦ ఆప్రాంతములో మార్వారాలోను, దక్షిణ రాజపుత్రస్థానములోని భిల్లుప్రాంతములోను మెరటు తెగలవారినుండి శాంతిని, శాసనబద్ధతను సంరక్షించవలసియుండుటచే ఈమెరటు తెగలవలనబాధఎక్కువగాజోధపూరు, మేవారు సంస్థానములలోని ప్రాంతములకు కలుగుచుండును. కనుక శాంతి సంరక్షణకగు ఖర్చులో కొంతభాగమును మేవారు, జోధపూరు దర్బారులకు పంచిపెట్టిరి. ఈవ్యయము చెల్లించు విషయములో ఏట్టి తగాదాలును రాకుండ, వ్యవసాయసౌకర్యముండుటకై మార్వారాలో సంస్థానములకు సంబంధించిన కొన్ని గ్రామముల భూములనుండి వచ్చుచున్న పనసూలు చేసికొను అధికారము అజ్మీరుపై అధికారముగల బ్రిటిషు అధికారికి ఉండునట్లు ఒడంబడిక చేసికొనబడెను. ఆ ఒడంబడిక ప్రకారం మిప్పుడు జరుగుచున్నది. పరిపాలనా సౌకర్యము ఆగ్రామముల పరిపాలనయు అజ్మీరు మార్వారా పరిపాలనాధికారి కప్పగించబడినది. అంతేగాని ఆ గ్రామములు బ్రిటిషిండియాలో ఎన్నడును చేర్పబడలేదు.

ఇపుడు ఈ ఏర్పాటునే ఉంచవలెనాయను ప్రశ్న యాలోచించబడుచున్నది. ఏలననగా మేవారు జోధపూరు సంస్థానములు మంచిబలముగల పరిపాలనను నెలకొల్పియున్నది. కనుక ఇపుడు బ్రిటిషిండియా అధికారులవల్లనే సంరక్షణ సంస్థానములకు అవసరములేదు. ఇది ప్రాతపద్ధతిని ఎట్లును మార్చువిషయమై ఆలోచించుటకు కారణము.

## పీతసాగర యుద్ధరంగము

చీనావారి అపజయము

పీకింగు నవ, ౧౩

చీనా సైనికులు పీతసాగరపు—యెల్లోసీ—యుత్తరతటము నుండి త్వరగా వెనుకకు పరుగిడుచున్నటులను టీన్ సటీన్ పౌకౌల్ ట్రంకు రైల్వేకు యిరువైపులగల ప్రాంతములను కొన్నిమైళ్లవరకు జపానువారాక్రమించుకొనినటుల పీతసాగర రంగమందలి జపాను సైనికులు విశదపరచుచున్నటుల జపాను వార్తలు ప్రకటింపబడినవి.

# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర కార్తీక బ॥ ౫

సోమవారము


## హరిజనులయెడ ముఖ్య ధర్మము

ఇది "అంటరాని కులములవార" లని చిరకాలము సామాన్యజనులచే వ్యవహరించ బడినట్టియు, "నిమ్న జాతులవారు"లని (depressed classes) ప్రభుత్వములచే పేర్కొనబడుచున్నట్టియు, "హరిజను"లని క్రొత్తగ గాంధి మహాత్మునిచే నామకరణము చేయబడి ఇపుడనేక జనులచే ఆపేర పిలువబడుచున్నట్టియు హిందూకులములఉద్ధరణప్రయత్న కాలము. ఈప్రయత్నములయందు బ్రిటిషిండియా రాష్ట్రములకంటె మన సంస్థానము ఎంతో దూరము వెనుకబడియున్నది. బ్రిటిషిండియా రాష్ట్రములలో ఈహరిజనుల ఉద్ధరణకై జరిగినంత ప్రయత్నము మనరాష్ట్రమందు జరిగియుండలేదు. దీనికి, గుంపులుగుంపులుగ ఈ హరిజనులను ఇతరమతములలో చేర్చుకొను ఉద్యమము, అది ఏచోటలేవదీయబడెనో ఆబ్రిటిషిండియాయందు ఎన్నడో చప్పబడియుండ, మనరాష్ట్రమందు ఇప్పటికిని మహావిజృంభణతో సాగుచుండుట ఒక ప్రబల నిదర్శనము. ఇట్లు ఇక్కడ హరిజనుల సేవజేయుచున్న హరిజనసేవక సంఘమునకు ప్రజలనుండి లభించుచున్న సహాయసంపత్తి చాలతక్కువగ నున్నది. ఈసంఘమునకు మించి హరిజనుల ఉద్ధరణకై ప్రత్యేకశ్రద్ధతో కృషిచేయుచున్న మరియొక బలీయమైన సవర్ణహిందూసంఘముగూడ ఉన్నట్లు కనుపించదు. జిల్లాలలో ఎక్కడనో ఒకటిరెండుచోట్ల సంస్కారాభిముఖులగు సవర్ణహిందువ్యక్తులుకొందరు ఎప్పుడైనను ఉత్సాహము పుట్టినప్పుడు చేసెడిసేవనుగూర్చి వార్తలు వచ్చునవేగాని, స్థిరమైన సంతతసేవ కానరాదు. ప్రభుత్వవైఖరి విషయములో మాత్రము బ్రిటిషిండియాకును మనరాష్ట్రమునకును, ప్రజల వైఖరివిషయములోనున్నంత భేదము ఉండకపోవచ్చును గాని, బ్రిటిషిండియాలో ప్రభుత్వసహాయమువలన కొందరు నిమ్నజాతులవారు మంచిప్రభుత్వోద్యోగములను పొందగలిగిన స్థితి వచ్చుట గమనించదగిన విషయము.

ఈ పరిస్థితులందు మన ప్రకటనశాఖవారు, "నిమ్నజాతుల"కొరకు ప్రభుత్వ ద్రవ్యముచే కట్టించబడిన బావులునిమ్న జాతులలో ఒకతెగవారికిమాత్రమే ఉపయోగపడుచు తక్కినవార లుపయోగించుకొనుటకు వీలుకాకుండుట జరుగకుండ ప్రభుత్వమువారు శ్రద్ధ వహించుటను గూర్చి గావించిన ప్రకటన చాల ముఖ్యమైనది, గమనించదగినది.

మనరాష్ట్రమందు హరిజనులయెడ సామాన్యముగ జనులుచూపుచున్న ఉపేక్షావైఖరికితోడు, వారలలోని అంతర్విభేదములు వారలను దుర్బలులనుగజేసి, మొండిసనాతనుల(కొంచెము ఉదారులగువారలు సనాతనులలోకూడ నుండరని మేమనుకొనముకాబట్టి) దుశ్చేష్టలకు ఆహారమొనగుచున్నవి. దీనికి నిదర్శనమును మన మాలుశాఖాధికారిగారు, ౧౯౪౬ఫ. ప్రారంభమందు గుల్బర్గాజిల్లాలో సంచారకాలమున చూచిరి. అక్కడ "నిమ్నజాతు" లందరికొరకై ప్రభుత్వమువారు త్రవ్వించిన బావులను, అక్కడి గ్రామాధికారులు కావలెనని చూచిచూడనట్లు ఊరకుండుట వలన, నిర్భీకులై బేగారితెగవారలు తక్కిన "నిమ్నజాతీయు"లను వాడుకొనని య్యకుండుటలేదని కనుగొనబడినది. ప్రకటనలోని వాక్యములను చూడగా, ప్రభుత్వద్రవ్యములతో కట్టించబడు బావులెప్పటికైనను అన్ని తెగలవారికిని సమానహక్కులతో వాడుకొనదగినవిగ నుండవలెననియే ప్రభుత్వాభిప్రాయమైనట్లును, కాని సవర్ణహిందువులు, "అంటరాని" వారలు అనుభేదమును ఏదోమోమోటముతో పాటించి ఇరువురికిని వేర్వేరుగ బావులను కట్టించినట్లును సూచితమగుచున్నది. అట్లయినపుడు హరిజనులలోని అంతర్విభేదములనుకూడ పాటించి ఒకరితోనొకరు సంపర్కమున కిష్టపడని వివిధకులములకు వేర్వేరుగ బావులనేర్పాటుచేయకూడదాయను ప్రశ్నపుట్టగలదు. కాని ప్రభుత్వమువారు ఈ ప్రకారముగ సంఘమును ఇంకనుచీలికలు చేయుట కిష్టపడుటలేదని ప్రస్తుతపు ప్రకటనయందు స్పష్టముగా,

> "నిమ్నజాతులకై త్రవ్వించబడిన బావులు నిమ్నజాతులలోని అన్ని తెగలవారి ఉపయోగమునకును లభించునట్లు చేయవలెను. నిమ్నజాతులవారల కందరికిని ఉద్దేశించబడిన బావులను నిమ్నజాతులలో కొందరు మాత్రమే, తక్కినవారిని రానీయకుండ, ఉపయోగించుకొనుట తప్పు. కాబట్టి నిమ్నజాతీయుని కెవనికి గాని నిమ్నజాతీయు లందరి కొరకు ఉద్దేశించబడిన బావులనుండి నీరు తీసికొనుటకుఅనుమతి నిరాకరించబడకుండునట్లు శ్రద్ధవహించుట ప్రభుత్వవిధానమై యున్నది."

అని ప్రభుత్వము వారు అనియుండజాలరు.

ఈవిధానమును అమలు పరచుటకుగూడ చర్యగైకొనబడినది. "క్షామనివారణ సంఘము" వారు ఈవిధానమును నామోదించి, ప్రభుత్వాధికారు లందరును,ముఖ్యముగా హిందూఅధికారులు, నిమ్నజాతులలోగల అంతర్విభేదములను తొలగించుటకై సర్వప్రయత్నములచేయవలయునని కోరినారు. తదనుసారము భూమ్యాదాయశాఖ, రక్షకశాఖ, వైద్యశాఖ, సుంకపుశాఖ,ఆబ్కారీశాఖల అధికారులు నిమ్నజాతుల బావులను నిమ్నజాతులలో ఎవరోకొందరు మాత్రమే ఉపయోగించుకొనుచు తక్కిన నిమ్నజాతీయు లుపయోగించుకొన నీయకుండ చేయకుండుటకై జాగ్రత్త వహించుటకు కోరబడిరి.

ఈ విధముగ నిమ్నజాతీయుల ఐకమత్యమును పెంపొందించుటవలన, వారల అభివృద్ధికిగల ఒక ఆటంకము తొలగగలదు. ప్రభుత్వమువారు ప్రత్యేకముగ హిందూఅధికారులను ఇందుకై శ్రద్ధవహించుటకు కోరుటవలన హిందూ అధికారులకు హరిజనులసేవను, డబ్బు ఖర్చులేకుండ, ఇటువంటి వ్యవహారములలో జోక్యము పుచ్చుకొనుటవలన అధికారుల ఆక్షేపణయుండునేమోయను భయములేకుండ చేయుటకు ఒక అవకాశము చిక్కినది. దీనిని శ్రద్ధతో ఉపయోగించుకొనుట హిందూఅధికారు లందరి ముఖ్యవిధియై యున్నది. నేటి దేశకాలపరిస్థితులయందు ఇట్టి సేవయొక్క

ప్రాముఖ్యమును ఎంతగా నొక్కిచెప్పినను అతిశయోక్తి ఉండజాలదు.

ఇదేవిధముగ ప్రభుత్వమువారు నిమ్నజాతీయుల కొరకు విద్యాసౌకర్యములను, విద్యార్థి వేతనసౌకర్యములను, ఉద్యోగసౌకర్యములను, వారలలో సామాన్యుల ఆర్థికస్థితి బాగుపడుటకు సౌకర్యములను ప్రత్యేకశ్రద్ధతో కలిగించగలరని ఆశించుచున్నాము. ఇపుడు కొన్ని సౌకర్యములను ప్రభుత్వమువారు అజ్ఞాపించియుండవచ్చునుగాని, ఆచరణసంపూర్ణముగాజరుగుటకు బావులవిషయములో వలెనే, ప్రత్యేకశ్రద్ధవహించుట ప్రయోజనకారి. దిక్కులేక హీనస్థితిలోనున్న హరిజనులెప్పటికిని అదేస్థితిలోయుండుట ఏప్రభుత్వమునకునుగాని కీర్తికరము. కాబట్టి వారలస్థితి బాగుపడుటకు ప్రయత్నములు ఎంతవేగముగ జరిగిన అంతే మంచిది.

## నన్నయ వర్ధంతి

కార్తీక శుద్ధ పౌర్ణమి గురువారం నాడు శ్రీకృష్ణదేవరాయల ఆంధ్రభాషా నిలయమునందు "నన్నయ భట్టారక వర్ధంతి" శ్రీ ఇల్లిందల సీతారామరావుగారి అధ్యక్షతక్రింద సమావేశమైనది. అధ్యక్షులుపన్యసించుచు నన్నయ భారతరచనా విధానమును, అతని ధర్మదృష్టిని, శరత్కాల చంద్రికవలెను గంగాప్రవాహమువలెను ఉన్న యాతని మనోహరశైలిని, వివరించిరి. ఉస్మానియా కళాశాల విద్యార్థులైన శ్రీ గొబ్బూరి రామచంద్రరావుగారు నన్నయగారి కావ్యమునందాతని వ్యక్తి స్వభావము, అవిరళ జపహోమ తత్పరత ఎంతవరకు ప్రతిఫలించినది సవిమర్శపూర్వకమైన వ్యాసమును చదివిరి. నన్నయ కొంతవరకు ఛాందసుడనియు లలితకళాదృష్టి ముఖ్యముగ సంగీత ప్రశంస యాతనియందు ఎక్కువ లేదని యభిప్రాయపడిరి. వ్యాకరణశిరోమణి సి. హెచ్. రంగాచార్యులవారు "నన్నయ-అక్షర రమ్యత"ను గూర్చి సుశ్రావ్యమును, విషయ బాహుళ్య పూరితమైన ఉపన్యాసమును గావించిరి. రసభావాలంకారము లను నన్నయ పోషించిన విధానమును సోదాహరణముగ చర్చించుచు నైషధాది మహాకావ్యముల సాదృశ్యమును అనుసంధించిన నన్నయగారి మహాకవిత్వము రీతిని తేటతెల్లము చేసిరి. శ్రీమతి కోరాడ భూషణమ్మగారిచే పంపబడిన "నన్నయ: స్త్రీపాత్రములు" అను మృదుమధుర వ్యాసమును శ్రీమతి యల్లాప్రగడ సీతాకుమారి గారు చదివి వినిపించిరి. నన్నయ చిత్రించిన స్త్రీలు ఒకటే అచ్చులోపోసిన పంచదార చిలుకలవంటి వారు కారు. వారిలో శర్మిష్ఠవంటి ముగ్ధలు, జరత్కారుని భార్య జరత్కారువువంటి పతిపరాయణలు, ద్రౌపదివంటి శూరవిదగ్ధలుకూడ గలరని తెలుపబడెను. అదిపూడి సోమనాథరావుగారు తరువాత ఉపన్యసించిరి. ఉభయభాషా ప్రవీణ శ్రీ నరసింహాచార్యులు గారును శ్రీ తిరుమల శేషాచార్యులుగారును "నన్నయ" మీద హృద్యములగు పద్యములు చదివిరి.

శ్రీ కార్యదర్శిగారు భాషా నిలయపు "మందిర విస్తారణ నిధి"ని గురించు తిరిగి విజప్తి గావించిరి. నాల్గయిదు మాసముల క్రిందయారంభింపబడిన ఈ కార్యక్రమము చాలవరకు జయప్రదమైనదని తెలిపిరి. దాదాపు రు.౨౫౦౦ లదాకా విరాళములు వాగ్దానములయ్యెను. ప్రస్తుతము వాగ్దానములైన మొత్తములు వసూళ్లు చేయబడుచున్నవి. విరాళములు వాగ్దానము చేసిన మహాశయులందరును దయతో తమతమ విరాళములను ధనరూపముగత్వరలో నిలయమునకు పంపి తోడ్పడగలరని మనవి చేసిరి. ఈ సందర్భమున శ్రీ శ్రీ రాజాబహద్దరు వేంకట్రామారెడ్డి ఓ.బి.ఇ గారు తమ విరాళము క్రింద రు.౧౨౦ ధనరూపమున అప్పుడేపంపి, విరాళమును వాగ్దానము చేయుటలో మొట్టమొదటనే మార్గదర్శకులైనట్లే విరాళము మొత్తమును చెల్లించి, ఇతరులకు దారిచూపి నిలయమువారి కృతజ్ఞతకు పాత్రులైరని తెలిపిరి.

ఈక్రింది దాతలు మందిర విస్తారణనిధికి ఔదార్యముతో విరాళముల వాగ్దానము చేసియున్నారు. శ్రీ కొల్లూరి రామమూర్తి గారు బి.ఎ.బి.యల్., వకీలు రు౧౨౦, శతావధాని ఆయుర్వేదాచార్య రామానుజస్వామి గారు రు౫౦, శ్రీఇల్లెందల సీతారామచంద్రరావుగారు హెచ్. సి.యస్. రు.౨౫లు శ్రీ శాస్త్రి శంకరయ్యగారు రు.౨౫లు.

## అహింసా వాతావరణ నిర్మాణమే ముఖ్య కర్తవ్యము

కలకత్తా నవ.౨౦

నిర్బంధితుల విడుదల విషయమై రవీంద్రనాథ ఠాగూరుగారి అభిప్రాయము విచారించ వారిటుల విశదపరచిరి:—

మన బంధువులు తిరిగివచ్చినందులకు స్వాగత పరచుచు మంత్రుల రాజకీయ పరిపక్వతను ఔదార్య కార్యమును అభినందించ కుండనుండ గూడదు. మన సంతృప్తి వ్యాగ్రూపమునచే గాక అహింసాతత్వ వాతావరణమును సృష్టించుటకు మనము కృషి సలిపి క్రియారూపమున విశదపరచుట ముఖ్యము.

## అధికారముల సంరక్షణకు హుసేనిగారి ఉద్బోధన

హైదరాబాదు నవం. ౨౦

నిన్న మధ్యాహ్నము నమాజు పూర్తియైనపిదప నగర మధ్యభాగమందలినిజామ్యాత్ ప్రార్థనా మందిరమునకు మక్కామసీదునందు మౌలానా సయ్యదు మహమ్మదు బాదుషా హుసేని సా॥ గారు వాజ అనంతరము ప్రజల నిటులసంబోధించిరి.

ఇస్లామీ రాజ్య మిది యొక్కటే పోనుపోనుయిప్పుడు మిగిలియున్నది. మత స్వాతంత్ర్యము,సత్ప్రవర్తనయుదాహరణముగ హైదరాబాదుమాత్రమే విశదపరచగలదు. రాజ్యము నేడొక క్లిష్టముగము నందుగలదు. ప్రతిపౌరుడు రాజ్యాధికారముల సంరక్షణమునకు, అమిత్వేము నకు పరమేశ్వరుని ప్రార్థించవలెను.

రంజాను మాసము మహమ్మదీయులకు చాలా మతప్రాముఖ్యతగల మాసము. ఈ మాసము పూర్తిగా వీరు రోజా అచరించుచుందురు. రంజాను మాసపు శుక్రవారమగుట వేనవేలకొలది మహమ్మదీయులు నమాజుకైమసీదునందు గుమిగూడియుండిరి.

## బాలికల ఉన్నతపాఠశాల మందిర నిర్మాణనిధి

భూరివిరాళములు (౧-౧౦-౩౭ నుండి)

| | |
|---|---|
| ౧. శ్రీరాజా పన్నాలాల్జీ రాజా గోవర్ధనలాల్జీగార్లు శ్రీరాజా బహదరు బన్సీలాలు హాలు నిర్మాణమునకు, మొదటికిస్తు రెండువేల రూపాయిలుకాక రెండవకిస్తుకింద | రు. ౫౦౦౦ |
| ౨. శ్రీశ్రీ. మహారాణి ఆదిలక్ష్మీ దేవమ్మ అమ్మగారు, గద్వాల సంస్థానాధీశ్వరి ఇంతకుముందు దయచేసిన రు.౧౫౦౦లు కాక | రు. ౫౦౦ |
| ౩, శ్రీయుత అక్కినేపల్లి జానకి రామారావుగారు, జాగీర్దారు మొత్తము వేయిరూపాయిల లో మొదటికిస్తు రు.౫౦౦లు పోగా రెండవకిస్తు. | రు. ౫౦౦ |
| ౪.శ్రీమతిపింగిలిరూపాబాయమ్మ గారు, దేశముఖిని, వరంగల్లు. ఇదివరకు ఇచ్చిన రు౧౦౦కాక రెండవ కిస్తు. | రు ౧౦౦ |

మొత్తము రు: ౬,౧౦౦

కృతజ్ఞతతో నందుకొనుచున్నాము.
బూ, రామకృష్ణారావు బి.ఏ ఎల్ ఎల్.బి,
మా. హనుమంతరావు
కార్యదర్శులు:

## భూకంపమువలన చిత్రాలు, సరిహద్దు ప్రాంతములు విపరీతముగా నష్టపడుట

ఢిల్లి నవ. ౧౯

గత ఆదివారము సాయంకాలము చిత్రాలు సంస్థానము, సరిహద్దురాష్ట్రమునందేర్పడిన భూకంపమువలన చాల నష్టము సంభవించినది.

పొలిటికలు యేజంటు గారి అసిస్టెంటు కార్యాలయము తప్ప మిగత భవనములు నష్టపడినవి. ఇంతేగాక భవనములు, యిండ్లు అన్నియు నివాసయోగ్యములుగా లేని స్థితియందు పడిపోయినవి.

యేజంటుగారి సౌధ ఉపరిభాగము మసీదు, మరికొన్ని భవనములు, పూర్తిగా పడిపోయినవి. మెహతరు బాజారుయందు పావుభాగము పూర్తిగా అతుకప్రాంతముగా మారినది. దోమలు, రోడ్లు లోతుగా కొయ్యగోసినవి. నడుచుటకు వీలులేదు,

పరిసర ప్రాంతమందలి గ్రామములలో సహితము చాలానష్టము వాటిల్లినది. ఇండ్లు వాకిళ్లు లేనందున ప్రజలల్లాడుచున్నారు ఇంతవరకుమాత్రము ప్రాణనష్టముకలిగినటుల వార్తలేవియు రాలేదు,

## గాంధీ సేవాసంఘ సభ

### నాయకుల ఆగమనము

జమ్నాలాలు బజాజుగారి భవనమున జరిగిన గాంధి సేవాసంఘ సభయందు సర్దారు వల్లభాయి పటేలు, జైరాందాసు దౌలతురాం, శంకర్లాలు. శంకరరావు, ఆచార్య కృపాలిని, గంగాధరరావు దేశపాండే, స్వామి ఆనంద, ఆచార్య దేవశర్మ, ఉపాధ్యాయ. డా. ప్రఫుల్ల చంద్రఘోషు. జమ్నాలాలుబజాజు, కాల్లేకర్, శ్రీ కృష్ణదాసు, కిషోరలాలు మున్నగువారు పాల్గొనిరి.

## ఆంధ్ర మహాసభ

౩, ౪, ౫, బహిమన్ ౧౩౪౭ఫ. సోమ, మంగళ, బుధ, వారములలో నిజామాబాదునందు జరుగును

మహాసభాధ్యక్షుడు.

### మందుముల నరశింగరావుగారు

మహిళాసభాధ్యక్షురాలు

### నందగిరి ఇందిరాదేవి గారు

ఆయుర్వేద మహాసభ అధ్యక్షుడు.

### సురవరము ప్రతాపరెడ్డి గారు. బి, ఎ., బి. ఎల్.

ప్రత్యేకరైలుబండి హైదరాబాదునుండి నిజామాబాదుకు రాను పోను మూడవ తరగతి రూ. ౩—౧౨—౦

వ్యవసాయ, పశువైద్య, పారిశ్రామికాది ప్రదర్శనములు జరుగును.

భోజనపు యేర్పాట్లు ఉచితము.

సోదర సోదరీ మణులందరు పాల్గొన ప్రార్థితులు.

ఆహ్వాన సంఘ కార్యాలయము నిజామాబాదు.

వేంకటభూమారెడ్డి, అధ్యక్షుడు.
బి. శేషగిరరావు.
సుబ్బారెడ్డి. } కార్యదర్శులు,

## బెంగాలు ప్రభుత్వము వారి నిర్ణయము నిరాశాపూరితము

### ౧౧౦౦ మంది నిర్బంధితుల విడుదల పాత పురాణము

సుభాషు బాబు గారి అభిప్రాయము

కరాచి నవ.౨౦

నిన్న ఉదయము ఆరోగ్య సందర్భములో విదేశముల కేగిన శ్రీ సుభాషు చంద్రబోసుగారు విమానముద్వారా ౮-౩౦ గంటలకిచ్చటికి దయచేసిరి. స్వామి గోవిందానంద్, ఆర్. కె.సిధ్వాయి మొదలగువారే గాకఅనేక మంది వీరిదర్శనార్థమై విమానపు స్టేషనువద్ద గుమిగూడియుండిరి. ప్రజలు వీరిని పుష్పమాలాలంకృతుల నొనర్చిరి. నిర్బంధితుల విషయమై బెంగాలు ప్రభుత్వమువారి ప్రకటన గురించి తమ అభిప్రాయ మిటుల విశదపరచిరి:—

నాకిది చాలా నిరాశాకరముగా గలదు ఈ విషయము మహాత్మునికి తెలిసిన వారెంత నొచ్చుకొందురో! వారు తమ యభిప్రాయమును త్వరలోనే విశదపరచవచ్చును. నిర్బంధితులలో రెండుతెగలవారు గలరు. ఒకరు గృహములలో లేక గ్రామములలో నిర్బంధింపబడియున్నారు. మరొకరు జేళ్లలో, క్యాంపులలో గలరు. చివరవారి స్థితి చాలా హీనముగా గలదు. ప్రభుత్వమువారి ప్రకటనయందు క్రొత్తవిషయమే లేదు. ప్రకటనయందు ప్రభుత్వమువారిని అభినందింపజేయు విషయ మేమియు లేదు. దీనికి వ్యతిరేకముగా దుఃఖకరములగు విషయము లనేకములు గలవు ఈ ౧౧౦౦ నిర్బంధితుల విడుదల వార్తను జూన్ నుండి మేము వినుచునేయున్నాము. మేము, గాంధి యొకవైపు, ప్రభుత్వమువారొకవైపు యీ కాలమంతా ప్రయత్నించుచునే యుంటిమి. సంవత్సరముల కొలది జేళ్లలో, క్యాంపులలో క్రుళ్లిపోవుచున్న వారల విడుదలకై మేము ప్రయత్నించుచుంటిమి. ఇంతేగాక శిక్ష అనుభవించిన నిర్బంధితుల, అండమాను ఖైదీల విషయమే యెత్తబడలేదు. ఎంతవరకు వారి విషయమై ఆలోచింపబడదో అంతవరకిది మాకనుమానాస్పదమే. బెంగాలునందు వీరివిడుదలకై తీవ్రముగా కృషి సలుపబడుచున్నది.

బోసుగారు ఉపచారార్థము అస్ట్రియాయందొక చల్లని ప్రదేశమునకు వెళ్లుచున్నారు. వారి బరువు నానాటికి తగ్గుచున్నది. ఇంగ్లాండు వెళ్లెదరా అని విచారించ "అచ్చట నా ప్రవేశమింకను నిషిద్ధముగా నుండుటచే వెళ్లలేనేమో" అని పలికిరి. "నాకి . కార్య క్షేత్రము. డిసెంబరు మాసాంతము నో, జనవరి మొదటివారములోనో తప్పక వచ్చితీరుదు"నని తెలిపిరి.

### మహాత్ముని ఆగమనము

నేడు సాయంకాలము నాగపురము నుండి మహాదేవ దేశాయి. సర్దారు పటేలు, ఆచార్య కృపాలిని, జేరాం దౌలత్ రాం వెంబడి మహాత్మ ఢిల్లీకి అరుదెంచిరి. ప్రయాణము సౌఖ్యావహముగా సాగినను అలసియుండిరి; మెట్టు యెక్కుటకు కొంతకష్టముగా తోచుచుండెను.

## జమానతుపై బాట్లివాలా విడుదల

నెల్లూరు నవ ౧౯

నిన్న సాయంకాలము పోలీసు నెల్లూరు జేలు నుండి యస్. యస్. బాట్లివాలాను యిచ్చటికి తీసుకవచ్చి మేజస్ట్రేటువద్ద ప్రవేశపెట్టగా హైకోర్టువారి అజ్ఞప్రకారము రు ౨౦౦౦లు రెండుజమానతులు యిచ్చినందున విడుదల చేసిరి.

## స్త్రీధర్మ పాఠశాల

సికిందరాబాదునందలి స్త్రీ ధర్మ పాఠశాల బాలికలు నవంబరు ౧౯వ తేదినాడు ప్రదర్శించిన నాటకము వలన పాఠశాలకు సుమారు రు౩౦౦లు లభించినవి, ప్రదర్శనమునందు దివాన్ బహాదురు వేణుగోపాలుగారిభార్యయు, డాక్టరు రాజాగారి భార్యయు అధిక శ్రద్ధను వహించిరి.

## కడపటి వార్తలు

## మద్రాసు మారిటోరియం బిల్లుకు ఉద్వాసన

మద్రాసు నవంబరు ౧౭

మదరాసు ప్రభుత్వమువారు రైతుల ఋణభారమును తగ్గించదలచి ముందుగా రైతులకు కొంత విశ్రాంతినొసగుటకై ఒక సంవత్సర కాలము రైతులనుండి ఋణముల వసూలు జరుగకుండ చేయుటకు మారిటోరియంబిల్లును తయారుచేసియుండిరి. ఈబిల్లుపై అనేకవిమర్శనలు బయలుదేరెను. ఇది కొంతఆదాయముగల రైతులకుమాత్రమే అన్వయింపచేయబడెను. కానికొందరుఅనునియమము ఉండరాదనిఆక్షేపించిరి. దానిపై మదరాసు శాసనసభలోని కాంగ్రెసుపక్షమువారు రాజగోపాలాచారిగారి అధ్యక్షతన సమావేశమై రైతులకు ఒసగవలసిన రక్షణవిషయమై ఆలోచించిరి. ఇపుడు మారిటోరియంబిల్లు వదలుకొనబడుననియు, రైతులకు సంరక్షణను సూచించుసమగ్రమైన ఇంకొకబిల్లు జనవరిలో శాసనసభలో ప్రవేశ పెట్టబడుననియు తెలియుచున్నది.

## సుభాసుబోసుగారి విమాన ప్రయాణము

కలకత్తా నవం ౧౯

సుభాసు చంద్ర బోసు గారు ఆరోగ్యమునకై విమానమందు ఇంగ్లాండుకు పోయిరి. అక్కడ బోసు గారుఒకటిన్నర మాస ముందురని తెలియుచున్నది.

## కుష్ఠురోగులపిల్లలకు ప్రత్యేకాశ్రమము

మధ్యరాష్ట్ర ప్రభుత్వమువారు కుష్ఠురోగుల పిల్లలెవరెవరు వైద్యపరీక్షచే కుష్ఠురోగబీజములు లేనివారని నిరూపించపడుదురో వారలకందరికిప్రత్యేకముగనొకఆశ్రమమునుఏర్పరచదలచినారు. ఇందుకై ఒకఅడవి కొట్టించబడును. అక్కడ వారలకు దున్నకొనుటకు భూమి లీజుబడుచే మొదట మూడేండ్లు పన్ను కట్టపనిలేదు. తర్వాత పదియేండ్లు సగము పన్నే తీసికొనబడును. ఈ విధానమువలని లాభమును ౨౫౦ కుటుంబములు పొందగలవు.

## షోలాపూరులో సభలు, ఉత్సవముల నిషేధము

షోలాపూరు నవం. ౧౮

షోలాపూరులో కొంగరనము మున్నగునేరములకు సదా అలవాటుపడినవారలు నిర్బంధించబడిన ఒకఆశ్రమముకలదు. వారలనందరిని వదలిపెట్టవలసినదని ఒక ఆందోళన ఇపుడు బయలుదేరినది. దీనికి షోలాపూరులోని "కడ్ ఫ్లాగ్ యూనియన్" అనబడు కమ్యూనిస్టుపక్షము మూలకారణమని బొంబాయి ప్రభుత్వమువారు తలచుచున్నారు. ఈ ఆందోళనచే అల్లరులు సంభవగోళముజరుగునని భయపడి షోలాపూరు మేజిస్ట్రేటు అక్కడ ఊరేగింపులు సభలు జరుగరాదని ఆజ్ఞాపించినాడు. ప్రభుత్వమువారు ఈఆజ్ఞను సమర్థించుచు ఆ ఆశ్రమములో నేరములకు అలవాటు పడినవారల నందరిని ఒక్కసారిగ వదలివేయుట ఉపద్రవకరమని తలచుచున్నారు. ఇదివరకే ప్రభుత్వము ఆనేరములవిషయమై ఆలోచించుటకు ఒక కమిటీని ఏర్పరచినను ఈ ఆందోళనచేయుట అక్రమమనుచున్నారు.

కాని పత్రికలలో ఈవిధముగ బహిరంగ సభలను ఊరేగింపులను జరుగకుండ చేయుట కాంగ్రెసు సిద్ధాంతమునకు విరుద్ధమని ఆక్షేపణలు చేయబడినవి.

## ప్రతిగ్రామములోను ప్రాథమికవిద్య ఏర్పాటు

మధ్యరాష్ట్ర విద్యా మహాసభ తీర్మానము

నాగపూరు నవం ౧౭

మధ్యరాష్ట్ర విద్యాశాఖమంత్రి రవిశంకర శుక్లగారు విద్యాస్థాయిసంఘ సభ్యులను, విద్యాశాఖ అధికారులను, నలుగురు ఇన్స్పెక్టరులను ఆహ్వానించి సమావేశపరచిన విద్యామహాసభవారు ప్రతిగ్రామమందును బాలబాలికలకు ప్రాథమిక పాఠశాల నేర్పాటుచేయుటకై శుక్లగారిచే తయారుచేయబడిన "విద్యామందిర" ప్రణాళికను ఆమోదించిరి. హైస్కూలు ప్రవేశపరీక్షను తీసివేయుటకును తీర్మానించిరి ఈతీర్మానమును వెంటనే ప్రభుత్వమువారు అమలుపరచి రూ ౩౦౦౦౦ లను మిగిలించుకొన దలచినారు. విద్యార్థులఒంటిమీద దెబ్బకొడ కూడదని తీర్మానించబడినది. మెట్రిక్యులేషన్ వరకుగల ౧౧ ఏండ్లకాలమును ౧౦ ఏండ్లకు తగ్గించువిషయమై చర్చించి, దానివిషయము ఆలోచనను మరియొకప్పుడు పూర్తిచేయ దలచిరి.

## మదరాసులో మిల్లుగుడ్డలపై పన్ను

వర్తకులకు అసమ్మతి

మదరాసు నవ ౧౭

మదరాసు ప్రభుత్వమువారి క్రొత్తబడ్జెటులో మిల్లుగడ్డలపై పన్ను వేయ్యరచినందులకు తమఅసమ్మతిని ప్రకటించుచు "మదరాసు గుడ్డ వర్తకసంఘము" యొక్క అధ్యక్షుడు మంత్రులకు ౧౬వ నవంబరునాటి సాయంకాలము విజ్ఞప్తిని పంపుకొనిరి. ఈపన్ను ఖాదీ అభివృద్ధికై వేయబడినది. ఖాదీ అభివృద్ధికి వేరొకమార్గము చూచుట మంచిదనియు, పన్నువేసినను అందరువ్యాపారులకు ఒక్కటేరేటు పన్ను వేయవలెననియు, ఇపుడు వేసినపన్ను అందరికి సమానముగ రెండురూపాయలమట్టుకు తగ్గించవలెననియుకోరిరి. ప్రధానమంత్రి రాజగోపాలాచారిగారు సమాధానమొసగుచు సూచితప్రకారము అందరికిని ఒకేవిధముగ పన్నువేసినచో చిన్న దుకాణదారులకు నష్టము కలుగుననిరి.

## నీలు శిలా విగ్రహము

మదరాసు నవం ౧౮

మదరాసుప్రభుత్వమువారు "జనరల్ నీల్" గారి శిలావిగ్రహమును మదరాసు నగరమందు మౌంటురోడ్డులో అది ఇపుడున్న స్థలమునుండి తీసి, మదరాసుప్రభుత్వమువారి మ్యూజియంలో చేర్చుటకు నిశ్చయించినారు

ఈసందర్భమున నీల్‌శిలావిగ్రహమును అటనుండి తీసివేయుటకు అనేక సంవత్సరముల కాలము చేయబడిన ఆందోళనను ౧౯౨౭ లో నీల్‌విగ్రహ [illegible] మున అనేక కాంగ్రెసు [illegible] ఇపుడు మదరాసు శాసనసభయగు [illegible] అధ్యక్షులగు బులుసు సాంబమూర్తిగారు జెయిలులో పడినవిషయమును జ్ఞాపకము చేయవచ్చును.

## బెంగాలు డిటన్యూల విడుదల

పరిస్థితులు నిరాశాపూరితములా?

కలకత్తా నవ ౧౭

గాంధీమహాత్ముడు బెంగాలు [illegible] మధ్య డిటెన్యూల రాజకీయ ఖైదీలవిషయమై చర్చింపబడిన విషయము అంతగా ఆశాపూరితము కానట్లు రాజకీయవర్గములందు వదంతులు బయలుదేరినవి. దర్బారులో సంబంధించినవారందరు సంతసముచే వెలిబుచ్చుచున్నారు. గాంధీమహాత్ముడు మంత్రులయెదుట సూచించిన క్రొత్తవిషయములను వారు సమ్మతించవలసి గలదు. నేడు సాయంకాలము యీ మూలసవిషయములగురించి ప్రభుత్వసభ్యులాలోచించవచ్చును. రేపుసహిత మి [illegible] చర్చనీయాంశముగా నుండగలదు. మంత్రులు ఏపని మహాత్ముని సంవర్శించిన సదర్భమున క్రొత్త రొందంబడిక యొకటి కల్పించవచ్చును. ఈపరిస్థితులలో మహాత్ముడు నేడు వార్ధా ప్రయాణము కావచ్చునని తోచుచున్నది.

చర్చింపబడిన విషయముల ఫలితము మాత్ర మింకను తెలియుటలేదు. జరిగిన [illegible] విషయమంతగా ఆశాపూరితము దోచుటలేదు. లార్డు బ్రాబోనుగారు గవర్నరుపదవి యంగీకరించినపిమ్మట యీవిషయ మాలోచింప బడవచ్చును. మహాత్మునిసూచనప్రకారము రాజకీయఖైదీలు, డిటన్యూలు యిప్పుడు రానున్న మాసంరోజులలో విడుదల చేయవలెనని యుండును. నేడు మహాత్ముని దర్శించిన యన్. ఆర్. సర్కారు, సర్ నజీముద్దీన్, ఎన్. వి. పి. రాయ్ మంత్రులు ప్రభుత్వసభయందీ విషయమింకను చర్చింపబడలేదనియు, గ్రామములందు నిర్బంధింపబడినవారిని వదలుటకు ప్రభుత్వమున కెట్టిఆక్షేపణ లేదనియు, నాలుగుమాసములలో రాజకీయఖైదీల నందరిని వదలివేసెదమనియు తెలిపిరి.

The only Leading National Bi-weekly of the whole Andhra Desa

GOLKONDA PATRIKA is The best medium for all traders and dealers — Advertise at once.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA PATRIKA is The only popular voice of 7,000,000 Andhras of THE NIZAM'S DOMINIONS

Volume 12 — HYDERABAD - DECCAN — Number 54

Monday 22 nd November 1937

## ఫ్రాంసులో 'హుడెడ్‌మెక్' ముసుకువారల యుద్యమము

### పోలీసువారు కుట్రసంఘము సోదాజూచి మిషిన్ ఫిరంగుల, తుపాకుల చేజిక్కించుకొనుట

ఎం. చౌటంగారు చేంబరులో మహస్య సింమచు దేశమునందు జరుగుచున్న "హుడెడ్ మెక్" సంచలనము — కుట్రసంఘకార్యముల - వివరించినను సంక్షిప్త నామము మాత్రము విశద పరచలేదు. వీరు సలిపిన కృత్యము లనేకము లున్నవి. ఫ్రాంసునందీసంఘము అనేకవ్యక్తులను దీనియందు మగ్న మొనరించుచున్నది.

ఈవిషయమునందు వ్యయపరచబడుచున్న ధనము, తయారు చేయబడుచున్న ఆయుధ సామగ్రి దుఃఖకరము గాగలదు.

చౌటంగారు చేంబర్‌వారికి విశ్వాసము కలిగించుచు త్వరలోనే నిందితులందరిని నిర్బంధించుటకు ప్రయత్నింపబడుననియు, ప్రభుత్వము వారు పార్లమెంటుకు వలయు శాసనాధికార మొసగుటకు కోరుదని తెలియపరచిరి.

చేంబరుయందు ప్రతిపాదింపబడిన విశ్వాస తీర్మానమునకు అనుకూలముగా ౩౯౯ ఓట్లు, ౧౭౧ ప్రతికూలముగా వచ్చుటచే తీర్మాన మంగీకరింపబడినది. అంతర్జాతీయపద్ధతుల, విదేశీయ, ఆర్థిక విషయములందు ౧౨ప్రశ్నలకు సమాధానము లొసగబడినవి.

దూరి బాపెల్లసుల శోధనయందు పోలీసు వారికి బాంబులు, ఇతర ఆయుధపరికరములు చేజిక్కినవి. ఇది కౌలార్డుసంఘము — కుట్రి సంఘము — వారి ప్రయత్నము దీనియందు పని చేయుచున్న వారలలో అధికసంఖ్యాకులు కెమ్మాకురాయిరిష్ట్రసంఘమునకు చెందినవారు గలరు. ప్రభుత్వమువారికిమాత్ర మింతవరకీ ప్రయత్నమునకు అర్థికసాయ మొనర్చువారి వివరములు, నాయకుల, యీసంఘోద్దేశములు విదితముకాలేదు;

ఇంకవరకు ౭౦౦మంది నిర్బంధింపబడిరి. సుమారు ౪౫౦ గృహముల పోలీసువారు సోదాచూచిరి.

ప్యారిసున కౌవలి ప్రాంతమగు డిప్పితీ జిల్లాలో ఈయుద్యమము తీవ్రముగా నున్నటుల తెలియవచ్చినది. పోలీసువారికి ౪౫ మెషిన్ ఫిరంగులు, ౧౫౦ తుపాకులు, ౨౦౦౦తోటాలు ఇతర సైనికపరికరములన్నియు అనుమానాస్పద ప్రదేశములనుండి చేజిక్కినవి. వివిధప్రదేశముల కివి రహస్య మార్గములద్వారా బంపబడు చుండెను. పత్రికలలో ప్రకటింపబడినవార్తలవలన నిస్సంత్రి యంత్రపరికరములవలన విషయములు విరివిగా దేశమునందు ప్రచార మొనర్పబడు చున్నటుల తెలియుచున్నది.

చాటంగారు రాష్ట్రిమంత్రితో పోలీసు వారి ప్రయత్నములకు చేదోడుగాగలరు.

## మాస్కో-పాప పరిహారము

ముగ్గిరిచావు-లారి నిర్బంధము

పాఠశాల బాలురను సరియగు పద్ధతిపై పోషింపక అజాగ్రతగ చూచిరను నేరముపై లెనిన్‌గార్డుయందు ముగ్గురుపాధ్యాయులకు, వీరియందొక యుపాధ్యాయినిగలదు. ఉరిశిక్ష విధింపబడినది.

ఇట్టి నేరముపైననే మరి లారికి ౧౦ నుండి ౨౦ సంవత్సరముల కఠినశిక్ష విధింపబడినది.

ఉపాధ్యాయులు ఫ్యాసిస్టులగుటచేతనే సోవియెటు విద్యాపద్ధతిని అగౌరవపరచిరని తెలియపరచిరి.

పిల్లలనుకొట్టినట్లు, తన్నినట్లు, చీకటి గదులలో బంధించినటులను, క్రుళ్లిన ఆహార మొసగినటులను తెలుపబడినది.

## హరిజనులలో అంతర్భేదములు

తొలగించుటకు ప్రభుత్వమువారి యత్నము

ప్రభుత్వ ప్రకటనశాఖనుండి ఈక్రిందిప్రెసు నోటు వెలువడినది:—

ఆదాయశాఖయొక్క డైరెక్టర్ జనరల్ గారు గుల్బర్గాజిల్లాలో ౧౯౩౭ ఉత్తర ప్రారంభమున సంచారము చేయునపుడు బావులను త్రవ్వించుశాఖచే అగ్రహిందువులకొఱకును, నిమ్నజాతులకొఱకును కట్టించబడిన బావులు, గ్రామాధికారులు చూచి చూడనట్లు ఊరకుండుటచే, బేగారికులకులచే గుత్తాగా ఉపయోగించుకొనబడుచు మాంగులు, ధేడులుమున్నగు తక్కిన నిమ్నజాతీయులను ఈబావులనుండి నీళ్లుతోడుకొననీయకుండ జేయుచుండినట్లు కనుగొనిరి.

ప్రభుత్వద్రవ్యముతో వ్యయము చేసి కట్టించబడిన బావులు ప్రజలలో అన్ని తెగలవారలును వాడుకొననీలుగ నుండవలెను. కాని ప్రభుత్వమువారు ప్రజలసంక్షోచములను గుర్తించి, హిందువులను, నిమ్నజాతీయులను సామాన్యముగా వేర్వేరు బావులనేర్పాటుచేసిరి. నిమ్నజాతీయులకొఱకు త్రవ్వించబడిన బావులు నిమ్నజాతీయులలో అన్ని కులములవారలును వాడుకొన వీలుండునట్లు చేయవలెను. నిమ్నజాతీయులందరికొఱకై ఉద్దేశించిన బావులను నిమ్నజాతీయులలో ఒక తెగవారలుమాత్రమే గుత్తాజేసికొనుట జరుగనీయదగనిది. కొట్టి, నిమ్నజాతీయులందరికొఱకు ఉద్దేశించి కట్టించబడిన బావులను నిమ్నజాతీయుడెవడుగాని వాడుకొనుటకు అక్షేపణ చేయబడకుండునట్లు శ్రద్ధవహించుటయే ప్రభుత్వమువారి విధానము.

ఈవిధానమును అస్పృశ్యతానివారణ సంఘమువారు (ఫామిన్ బోర్డు) ౨౭-౮-౧౩౪౬ ఫసలీ నాటిసభలో ఆమోదించి, ప్రభుత్వాధికారులందరును, విశేషముగా హిందూ అధికారులు నిమ్నజాతీయులలో ఒక తెగవారికి ఇంకొక తెగవారియెడగల దుష్పంకలను తొలగించుటకు విశ్వప్రయత్నములను చేయవలెనని కోరినారు.

తదనుసారము భూమ్యాదాయశాఖ, రక్షకశాఖ, వైద్యశాఖ, సుంకపుశాఖ, అబ్కారీశాఖల అధికారులు ఆబావులను నిమ్నజాతీయులలో ఒకతెగవారు తక్కిన తెగలను ఆటంకపరచి ఉపయోగించుకొనుచు గుత్తాచేసికొనుట జరుగకుండ శ్రద్ధబూనుటకు కోరబడినారు.

## లార్డు టెన్నిసన్ క్రికెటుటీం నిజాం రైల్వే యేర్పాట్లు

హైదరాబాదు నవం ౨౨

బొంబాయిలో డిసెంబరు ౧౮వతేది నాడు లార్డుటెన్నిసన్‌టీంకును, ఇండియన్ ఎలెవెన్‌కును జరుగనున్న క్రికెటుపోటీని చూడదలచెడివారికొఱకు టికట్లను సంపాదించి పెట్టుటయేర్పాటు చేయబడినదనియు, కావునకోందరగా తమ అభిప్రాయమును టికట్లనుకొని సలమును ప్రత్యేకించుటకై చీఫుకమర్షియల్ ఆఫీసరుకు తెలుపవలసినదనియు నైజాం రైల్వేవారు ప్రకటించుచున్నారు.

## అలహాబాద విద్యార్థుల సమ్మె

జవాహర్లాలు నెహ్రూగారి యుద్బోధన నిరాకరణము

నిరాశాపూరితులై పండితులు సభనుండి లేచిపోవుట

అలహాబాద నవ. ౨౧

ఏవింగ క్రిశ్చన్ కాలేజి, అగర్వాల్ విద్యాలయ యింటర్ కాలేజి, విద్యామందిర హైస్కూలులోని సమ్మె విద్యార్థులందరు జవాహర్లాలు నెహ్రూగారి సలహాను నిరాకరించినందున నెహ్రూగారు నిరాశపూరితముగా అర్ధరాత్రివేళ గృహోన్ముఖులైరి.

పైమూడు విద్యాసంస్థలలో సమ్మెజరుగుచున్నది. నిన్న సమావేశమైన యీసమ్మె విద్యార్థుల బహిరంగసభయందు నెహ్రూ పండితుడిటుల సంబోధించెను.

సమ్మెసలుపుటము లాభదాయకము. కాని నేడు దేశమునందనేక ముఖ్యసమస్యలుండ విద్యార్థులిట్టివిషయమై సమ్మెసలుపుట అంతగా ఫలదాయకము గాజాలదు. ప్రస్తుతపరిస్థితియందు విద్యార్థులందరు గౌరవనీయమైన పరిష్కారమునకు ప్రయత్నించవలయును. వెంటనే యీ సమ్మె అపివేయుట ఉత్తమము. క్రిశ్చియన్ కాలేజి అధికారు లనుమతించవంతవరకే కృష్టియన్ కాలేజిభవనముపై జాతీయపతాకము నెగురవేయుటకు సంకల్పించడమటనిశ్చయము. కాలేజి ప్రిన్సిపాలు, జాతీయపతాక మెగురవేయుటకు సమ్మతించి అధికారుల అనుమతి బడయకనే డాక్టరుఅహమదుగారివలన నెరిగింపజేయుటయే సమ్మెకారణము. దీనియందు అహమదుగారివలన పతాకమెగిరింపుట అక్షేపణీయముగా గలదు."

అలహాబాద విశ్వవిద్యాపీఠమునుండీ విషయమెటుల పరిష్కరింపబడినది వివరించుచు "పతాకమునుగురించి సమ్మెసలుపుట భావ్యముగాజాలదు. దీనికేర్పడిన పలుకుబడి, గౌరవము వలన యిది దేశమందంతట జాతీయ పతాకముగా గలదు. కొబట్టి యిట్టిపతాకము బలవంతముగా నెగురవేయగూడదని నాఅభిప్రాయము" అనిరి.

నెహ్రూగారి సందేశ నిరసనము

నెహ్రూగారు సంబోధించినపిదప యొక విద్యార్థి విద్యార్థుల సమ్మె ప్రశంసించుచు అధికారుల ప్రవర్తనపై నిరసనము ప్రకటించుచు తీర్మానము ప్రతిపాదించెను. తీర్మానమును ప్రతిపాదించు "నెహ్రూగారు సమ్మెవిషయమును ఉపాధ్యాయుల సంబంధమునకంటె గట్టు నుచితము గాజాలదని" చెలిపెను. తీర్మానమును ప్రతిఘటించుటకు కొందరు విద్యార్థులు అనుమతికోరినను నిరాకరింపబడెను. రాత్రి చాలాఅయినందున నిరాశాపూరితముగా పండితుడు వెళ్లిపోయెను. తీర్మానమంగీకరింపబడెను.

## 'మేరి అంటూనెటు మాలా'

లక్ష ౫వేల కరోడ్గిరి మహసూలు

బొంబాయి నవ. ౨౦

బొంబాయి కరోడ్గిరి శాఖవారు ప్రస్తుతము దర్భంగా మహారాజాగారి ఆస్తిగాగల 'మేరి అంటూనెటుమాల'పై విపరీతపు మహసూలు నిర్ణయించి శాఖా చరిత్రయందు క్రొత్త విషయము చేర్చుటకు తీవ్రముగా ప్రయత్నించుచున్నారు. కరోడ్గిరిశాఖవారు ప్రతిశతి ౫౦ వంతున అనగా ౧లక్ష ౫వేల రూప్యములు మహసూలు నిర్ణయించిరి. మహారాజ పరివారము వారికి మాలనైకొనిపోవుట కనుమతివ్వబడినను శాఖవారు మాత్రము మహసూలు చెల్లించి తీసవలయునని నిశ్చయించిరి. మహారాజాగారు వీనిని ౨లక్షల ౧౦ వేలకు కొని యుండిరి. దీనిపై యెట్టిమహసూలు విధింపబడదని తెలుపబడెను. ఇది ౧౫౦సం॥ముల నాటిదియగుటచే యిది ప్రాచీన వస్తువులలో పరిగణింపబడినని. ఒకకాలమునందీ మాల ఫ్రాంసు ప్రఖ్యాతి కలత మలంకరించి యుండినందున దీనికి తగినంత వెల యిది గాజాలదని మహారాజాగారి అభిప్రాయము, ప్లాండో డచెస్, ఆమెసోదరి దీనిని ధరించెనిరి. దీనియందు ౪౩ వెలగల మణులు గలవు.

## ఇటలీ అధికారుల అమానుష చర్యలు

అబిసీనియా సర్దారుల ఫలపూరిత ప్రయత్నము

క్రొత్త వైస్రాయి

ప్యారిస్ నవ. ౨౦

మార్షల్ గ్రేజ్యానికి మారు డ్యూక్ ఆఫ్ అయోస్టా అబిసీనియా రాజప్రతినిధిగా నిర్ణయింపబడినటు ప్రభుత్వము వారి ప్రకటన త్వరలో వెలువడనున్నది.

జబోటినుం డరుదెంచుచున్న వార్తలవలన అబిసీనియాయందు యిటలీ ప్రజలకు శాంతము యేర్పడినటుల తెలియుచున్నది. అబిసీనియా వారు యిటలీ సైనికులతో తరుచుగా పోరాడుచునే యున్నారు.

మకాలె, అంబరాడం, అంబాఅలాగి రంగములు తిరిగి అబిసీనియా వారి శాధీనము లైనటుల గలదు. టాయిగర్ యందొక సర్దారునిభార్యను అవమానించినందువలన అలజడి ప్రారంభమయ్యెను. ఈ సర్దారుడు డివిజనలు కమాండరు. ప్రభుత్వ కార్యనిర్వాహకార్థ మన్య ప్రాంత మేగెను, ఈతడు యింటియందు లేని విషయము గ్రహించి యిటలీ కమాండరొకడు వాని యింటియందు ప్రవేశించి అతనిభార్యను చెరచెను. అబిసీనియా అధికారి కీ విషయము తెలిసినవెంటనే సైనికులను ఆలోచనలకై పిలిచిరి. అమానుషవిషయ మెరిగి సైనికులు యిటలీ అధికారుల చంపుటకు నిశ్చయించిరి. వెంటనే యిటలీవారి ఆయుధాగారమును ఆక్రమించుకొనిరి. ఇటలీవారికీ తిరుగుబాటు విషయము తెలిసి విమానముల ద్వారా ఆప్రాంతములకు వెళ్లిరి కాని దేశీయు లెవరును కనపడలేదు. ఇటలీవారు బాంబులు విసర మొదలిడిరి. అబిసీనియనులు సురక్షిత ప్రదేశములనుండి యీ దృశ్యములను గాంచుచుండిరి.

అబిసీనియా సైనికులు మార్గలా జయించిరి. ఈప్రాంతము పూర్తిగా వారి స్వాధీనమునందు గలదు. జమ్మాసమీపమందలి లేకంపతి వీరికి అధీనమగుటంజేసి అచ్చట అబిసీనియా వారి పతాక మెగురుచున్నది. అడిస్ అబాబా సమీపమందలిగిరాగి అబిసీనియాకు అధీనమైనది. ఫిటా యిగిరా కూరు ల నే కులు అనేక ప్రాంతముల స్వాధీనపరచుకొనిరి. సుమారు ౨౦౦ యిటలీ సైనికులు అబిసీనియా వారితో చేరమై యిటలీ సైనికులనే యెంత మొందించుచున్నారు. కొందరు యిటలీప్రజలు అబిసీనియా అధిపత్యమును అంగీకరించిరి.

## సమ్మె పరిష్కార సూచన

సర్దారు పటేలుగారి ప్రయత్నము

బొంబాయి నవ. ౨౧

ఆల్ యిండియా కాంగ్రెసు పార్లమెంటరీ ఉపసంఘాధ్యక్షులగు సర్దారు వల్లభాయిపటేలు గారు నేడు వార్ధానుండి బొంబాయి అరుదెంచిరి. నేటి సాయంకాలము వీరు అహమదాబాదు వెళ్ళుచున్నారు. అచ్చట సమ్మెసలుపుచున్న కార్మికులు, మిల్లుయజమానులు సమ్మెపరిష్కారమునకు వీరిని అహ్వానించిరి, బహుశః రెండు మూడు రోజులలో పరిష్కరింపబడవచ్చునని దోచుచున్నది.

## ఊరేగింపు ఫలితము

యువకులకు ప్రవాసశిక్ష

జనంతేవాయి నవ ౨౧

జిమ్మజిల్లా మేజస్ట్రేటుగారి అజ్ఞప్రకారము హిందూసిక్కు యువజనసంఘమునకు చెందిన ౫గురికి ప్రవాసశిక్ష విధింపబడినది. ఈసంఘము వారు ౧౪ నవంబరునాడు జరిపిన యూరేగింపునందు నిషిద్ధవాక్యము లుచ్ఛరించినందున వీరికీ శిక్ష విధింపబడినది.

## భారత సైనిక వ్యయములు

లండన్ నవ. ౧౯

పార్లమెంటువారు ఉభయుల పొందు భారతీయ సైనిక పునర్నిర్మాణము గురించి అంగీకరించినందున ఉభయ ప్రభుత్వములమధ్య ఆర్థిక సంబంధము చక్కగా యేర్పడగలదని విశ్వసింపబడుచున్నది. ఇదివరకీ వ్యయమంతయు ఇండియా ప్రభుత్వమువారే భరించుచుండిరి.

అండర్ సెక్రటరీయగు లార్డుస్టాన్లే యీ ప్రభుత్వవిరాళమును కామన్సు సభలో తెలియపరచిరి.

## సోషోవద్ద జపాను సైనికుల అడ్డగించుట

షాంఘాయి నవ. ౧౯

కౌషిన్‌యం దొక ప్రాంతము జపాను వారికి అధీనమైనను చాంగీమాల్ యాన్పోమధ్య గల చీనా "హిండెంబర్గ్‌లైన్" యందు ప్రవేశించినటుల వార్తలుగలవు. కాని యీరంగమునందు జపాను వారికి విషమించినటుల చీనా వార్తలు గలవు, జపానువారిని చీనా సైనికులు సోషోవద్ద అడ్డపడుటయే గాక ధైర్యసాహసములతో పోరాడినందున తిరిగి కొంత ప్రదేశమాక్రమింపబడినది. చీనావారిని అణచుటకు జపానువారివి ౩౧ విమానములు సాయపడినను జపానువారికి మాత్రము చాలా నష్టము కలిగినది.

గడచిన రెండు వారములలో జపానువారికి ౦౦వేల సైనికుల సాయము కలిగినటుల చీనా వార్తలు తెలుపుచున్నవి.

## మహాత్మ్యము

మదరాసు నవ. ౨౦

నిర్బంధితుల విడుదల విషయమై సత్యమూర్తిగారు తమ అభిప్రాయ మిటుల తెలియపరచిరి: —

"నిజముగా మ హా త్మ ని" మహాత్మ్య "యుగమింకను పూర్తిగావించలేదు, బెంగాలు నిర్బంధితుల విడుదల మహాత్ముని విచిత్రశక్తుల ఫలితమేయనుట నిస్సంశయము. ఈ మహా కార్యము నెరవేర్చినను బెంగాలు ప్రభుత్వము సత్వర విరామార్గమైనది. అనతికాలములో కాంగ్రెసు మంత్రివర్గ మేర్పడవలయును."

## సరిహద్దు ప్రాంతములో సైనికప్రదర్శనములు

ఢిల్లి నవ. ౨౧

౨౫ నవంబరు ౧౯౩౬ నుండి అక్టోబరు ౧౯౩౭వరకు వజీరిస్థాన్‌యందలి సైనిక ఆదర్శములకు ౧౬౦ లక్షల రూప్యముల వ్యయము జరిగినది. ౨౫నవంబరు౧౯౩౭ వరకు ప్రభుత్వము వారి సైనికులలో ౨౩౨ మరణించిరి; ౬౬౩గురు గాయపడిరి. వజీరిస్థాన్‌లో చాలావరకు సంచలన మాగినది. ఆప్రాంతములవారు రవేశులు ప్రభుత్వముతో పోరాడిరి. ఫ్రికాపి మొదలగు నాయకులుమాత్రము యింకను అధీనముకాలేదు. వీరిసంఖ్య చాలా తక్కువగాయున్నను అప్పుడప్పుడు మాత్రము పోరాటములు సాగుచునే యున్నవి. మరికొన్నిమాసముల వరకివి జరుగవచ్చును. ప్రస్తుతముపూర్తిగాప్రదేశముఅధీనమందేర్పడనున్నను అనతికాలములో సంభవమను సూచనలు గోచరించుచున్నవి.

## నిజాంరాష్ట్రి ప్రజా పరిషత్తు

ప్రశ్నావళి ప్రజాభిప్రాయమునకై ప్రముఖులకు పంపబడుట

(గోలకొండ ప్రతినిధి)

హైదరాబాదు నవం ౨౨

నిజాంరాష్ట్రిపు ప్రజాపరిషత్తుయొక్క ఉపసంఘముల సమావేశములు పరిషత్తు నిర్మాణ కార్యక్రమమును ప్రారంభించినవి. తరుచుగా ఉపసంఘ సమావేశములు జరుగుచున్నవి. సంఘసమావేశ వివరములు సంపూర్ణరహస్యముగా నుంచబడుచున్నను, ఇటీవల జరుపబడిన సమావేశములందు రాజ్యాంగసంస్కరణలను గూర్చి ప్రజాభిప్రాయము నెటుల సంపాదించవలెను అను విషయమునుగూర్చి సభ్యులందు చర్చజరిగెనని తెలిసినది. కొందరుసభ్యులు ప్రజాభిప్రాయమును వాగ్రూపకముగను లిఖితరూపకముగను గైకొనబడుట వసరమని తెలిపిరి. కానిఒకరిద్దరు సభ్యులు వాగ్రూపకమగు వాఙ్మూలములను యొసగినవారికిని, గైకొనినవారికిని యిబ్బంది యేననియు, ఇటీవలనే ఇట్టి వాఙ్మూలములను గైకొనిన యొక ప్రభుత్వ నియమితవిచారణ సంఘమునందు వాఙ్మూలముల నొసగిన కొందరునాయకులు తమ వాఙ్మూలములు సరియగువిధమున యుల్లేఖింపబడలేదని అరోపణకు కారణమయ్యెననియు అందుచే లిఖితరూపకమగు వాఙ్మూలములమాత్రమే గైకొనబడుట ఉత్తమ పద్ధతియనియు విదితపరచిరి. అందుపై లిఖితరూపకమగు వాఙ్మూలములనుమాత్రము గైకొనుటకు తీర్మానింపబడినట్లు విదితమగుచున్నది.

లిఖితపూర్వక వాఙ్మూలములను గైకొనుటకు ప్రజాప్రముఖులకు పంపబడెడి ప్రశ్నావళి ఈ సమావేశములందు సిద్ధపరుపబడెను. అట్లు సిద్ధపరుపబడిన ప్రశ్నావళి రాష్ట్రిమందలి పలువురు ప్రముఖులకు పంపబడెనని రూఢిగా తెలియుచున్నది. ప్రశ్నావళితోపాటు నొక వివరణపత్రముకూడ పంపబడెను.

పరిషత్సంఘమునందు సభ్యుడుగా యెన్నుకొనబడిన ఒక మహమ్మదీయ సభ్యుడు తన సభ్యత్వమునకు ; అనంగీకారము తెలుపుచు ప్రస్తుతము సమాఖ్యయే దేశమును కలవరపెట్టుచున్న సమస్యకావున అంతర సంస్కరణలిది సమయముకాదనియు, ఇంతేకాక పరిషత్తునందు ఫెడరేషను అలోచనీయాంశముగా గూడా లేదనియు, అందుచేత పరిషత్తునందు తాను సభ్యుడుగా నుండ వీలులేదనియు తెలిపిరి.

## బర్మాలో జపానువస్తువుల బహిష్కరణము

రంగూన్ నవ ౨౦

రంగూన్‌లో జపానువస్తువుల బహిష్కరణము తీవ్రముగా జరుపుటకు స్త్రీలు యీ విషయమునందు పాల్గొని సఫలపరచుటకు ప్రయత్నించుచున్నారు.

బహిష్కరణ సంఘమువారేర్పరచిన సభయందొక చీనావిద్యార్థి "స్త్రీలు యీ యుద్యమమునందు పాల్గొనుటచే త్వరలో ఫలవంతమైతీరును" అని నుడివెను.

## మద్యపాన నిషేధము

సేలం నవ ౨౦

సేలంజిల్లాలో మద్యపాననిషేధమారంభింపబడినది. ౩౧ అక్టోబరులో అంతమగు మొదటి మాసములో కల్లుఅమ్మబడుచుండిన నాలుగు అంగడులలో కల్లుకు(మారు తేనీరుం చబడుటచే ౨౫వేల కప్పుల తేనీరువిరివిగా ప్రజలకివ్వబడినది. ౨౭వేల తేయాకు ప్యాకెట్లు విక్రయింపబడినవి.

ఇంతవరకు ఈజిల్లాలో సుమారు౮మణుగుల తేయాకు విక్రయింపబడుచుండెను. కాని అక్టోబరుమాసములో ౩౨ మణుగులు విక్రయింపబడినది. అనగా తేయాకు వ్యాపారమునందు వృద్ధికలిగినది.